

సు

# స్త్రీ విద్యా సార సంగ్రహము

గీ॥ చాన సంయుక్త పద్మిని • చౌధురాణి
విమలయు నహల్య యిందిర • వెలది లాల
పన్న బాయి కనుల మొదల్ • పద్మముఖుల
గను భరతమాత మనలను • గాచుగాత॥

పూర్వకాలంబున ప్రపంచమునందలి అన్ని దేశములందును సకలవిషయములను మన భరతఖండము మిన్నయె వన్నె గాంచి మేలుబంతియై ప్రకాశించుచుండెడిది. ఇప్పుడు పూర్వపుగౌరవ మడుగంటి అన్ని విధముల గడు హైన్యమునొందియున్నది. ఇట్టి మహాభేదమునకు గారణముండితీరవలెను. అది, ముందు మన వారలట్టి యున్నతదశనొందుట కవలంబించినపద్ధతులు మనము విడనాడియుండవలెను. మనపూర్వుల యాచారములను ప్రస్తుతకాలమునందలి మన యాచారములను విమర్శించి చూచినచో వారవలంబించిన దేశక్షేమాభివృద్ధికరములగు పెక్కు సంగతులు మనము వదలియున్నామని విశదపడగలదు. అట్టి యాచారములాదు మనముపేక్షించిన అతిప్రాముఖ్యమగు నా

చారము స్త్రీలకు విద్య నేర్పించుట. ఇందుకు మనము రెండు సంగతులు రుజువు సేయవలయును. మొదటిది స్త్రీలకు విద్య నేర్పించు నాచారము పూర్వ కాలమునగలదా? రెండవది స్త్రీలు విద్యావతులైనచో సంఘాభివృద్ధి కెట్లు కారకురాండ్రగుదురు? ఇందు మొదటిసంగతికి మన శ్రుతిస్మృతి పురాణేతిహాసములు సాక్ష్యమిచ్చుచున్నవి. అప్పటి కాలమున స్త్రీలు విద్యావతులగుటవలననే శ్రుతులలో కొన్ని సూక్తములు రచియించియుండిరి. ఋగ్వేద సంహితయొక్క 5వ మండలములో 28వ సూక్తము విశ్వవారయనునామెయు, 10 వ మండలములోని 125వ సూక్తము అంభ్రిణుని పుత్రిక వాక్కనునామెయు, 19 వ సూక్తము అగస్త్యునిభార్య, లోపాముద్రయనునామెయు, 10వ మండలములోని 85వ సూక్తము (వైవాహికసూక్తము) సవితృపుత్రియగు సూర్యయనునామెయు రచియించియుండిరి. ఇంకను పెక్కు వేదమంత్రములు స్త్రీలురచియించినవి కానంబడియెడిని. గోభిలగృహ్యాసూత్రము 1 ప్రపర 3 ఖండ 15వ సూక్తమున "పత్నీమధ్యాపయేత్ కస్మాత్ పత్నీ జుహుయాదితి వచనాత్" అనగా భార్య హోమముసేయు నధికారము గలదిగాన వేదాదివిద్యలు నేర్పవలెను అనియున్నది. శ్రుతి "తస్యైహోత్రా యేహజాయాపతీసంరభేదాం" అనగా మూకాదులు హోమాదికార్యములందు పఠించవలయు మంత్రములు భార్యాభర్తల కభేదములగుటచే భార్యలే పఠించవలెననుటచే స్త్రీలు విద్యావతులుకావలెనని స్థాపించుచున్నది. పూర్వమీమాంసయందు జైమిన్యాచార్యులవారు "యాగాదిషుస్త్రీపుంసయోరధికారాధికరణమ్" అను నధికరణమునందు స్త్రీల

కు యాగాధికారము తన్మంత్రపఠన తదర్థవేత్తృతాధికార మును జెప్పినారు ఆప్రకరణమునందే బాదరాయణాచార్యుల వారు స్త్రీకి స్వతంత్రధనాధికారమును నిర్దేశించినారు. శారీరకమీమాంసయందు "అంతరాచాపితదదృష్టేః" అను సూత్ర భాష్యమునందు "రైక్వవాచక్నవీజానశ్రుతిప్రభృతీ నామేవం భూతానామపిబ్రహ్మవిత్వ శ్రుత్యుపలబ్ధేః" అను మొదలగునవియు, బృహదారణ్యకోపనిషత్తు పంచమాధ్యాయము పంచమబ్రాహ్మణమునందు "అథహైనం గార్గివాచక్నవీపప్రచ్ఛ" అనియును, "తయోర్హమైత్రేయీ బ్రహ్మవాదినీబభూవ" అని మైత్రేయీ బ్రాహ్మణమునందును గానంబడుటచే స్త్రీలు వేదాదివిద్యలు నేర్చి బ్రహ్మవిద్యాభ్యాసము సేయుచుండువారని స్పష్టముగా గానంబడుచున్నది. మరియు 'సాంవత్సరికమాయంసంఖ్యాయ తదనురూపం వ్యయంకుర్యాత్" అనగా స్త్రీలు తనకు సంవత్సరమునకు వచ్చురాబడిని లెక్కించి దానికి తగినట్లు వ్యయముసేయవలయును అని వాత్స్యాయనకామసూత్రములందలి సహధర్మిణీచర్యయందు జెప్పబడినది. ఇట్టికార్యము నెరవేర్చుటకు స్త్రీలు విద్యాగంధమెరుగని మూఢురాండ్రుపయోగపడియెదరా? "శ్లో॥ సదాప్రహృష్టయాభావ్య గృహకార్యేషుదక్షయా । సుసంస్కృతోపస్కరయావ్యయేచా ముక్తహస్తయా" అనగా సర్వదా సంతోషితస్వాంతయు, గృహకార్యములందు దక్షయు, నాయవ్యయంబు లెరింగినదియు, శుచిగా పాకాదులుసేయుచు గృహోపకరణాదులు శుభ్రముసేయునదియు కావలయును, అని స్మృతివాక్యము బోధించుచున్నది. ఇట్టి స్త్రీ విద్యావతి కావలయునని వేరుగ జెప్పవలెనా? "స్త్రీ

యస్సతీః। తాఉమేపుగ్ంసఆహుః" ఈ వేదవాక్యమునకు మాధవవిద్యారణ్యులవారీక్రింది విధమున వ్యాఖ్యానము వ్రాసిరి. "స్త్రియస్సతీః ఇతియాలోకప్రసిద్ధాః స్త్రియఃసతీః సద్రూపాః గురుకటాక్షేణ। సదేవసోమేదమగ్ర ఆసీదిత్యాది శ్రుత్యుక్తంసద్వస్తుబుధ్వాతదనుభవేన తద్రూపావర్తంతే, తాఉతా అపి స్త్రియఃమేమ తేపుంస ఆహుః బ్రహ్మవిధః పురుషాన్కథయన్తి, యద్యపిశరీరే స్త్రీలక్షణాదృశ్యతే, తథాపి పురుషస్యోచితంతత్వజ్ఞానమస్తీతి పురుషలక్షణ సద్భావాత్పురుషత్వం తాసామభిజ్ఞాః కథయంతి, యేతుశరీరేశ్మశ్రుప్రభృతిభిః పురుషలక్షణైర్యుక్తా అపి పురుషస్యోచితం తత్వజ్ఞానసంపాదయంతి, స్త్రీణాముచితే నమోహేన ఉపేతత్వాత్ తేస్త్రియఏవేత్యభిప్రాయః" అనగా స్త్రీయైజన్మించి శరీరమున స్త్రీలక్షణములు గలిగియుండినను తత్వజ్ఞానానుభవశీలలగు స్త్రీలు పురుషులుగానే భావింపబడెదరు. తత్వజ్ఞానశూన్యులై స్త్రీసామాన్యమగు మోహముచే గ్రస్తులై నిరక్షరకుక్షులై యుక్తాయుక్త వివేకశూన్యులైనవారు గడ్డములు మీసములు మొదలగు పురుషలక్షణము గలిగియు స్త్రీలవలెనే భావింపబడెదరు అని. వేదకాలమునందు స్త్రీలిటుండెడివారు పురాణకాలమున"దమయంతీమహాప్రాజ్ఞా" "విదుషీద్రౌపదీ" ఇత్యాదివచనములచే భారతాదులయందు స్త్రీలు పాండిత్యముకలవారనియు, ధర్మజ్ఞురాండ్రనియు, జ్ఞానముగలవారలనియు, బహువిధముల వర్ణింపబడియున్నది. అద్యతనభూతకాలమునందు "శ్లో॥ శీలావిజ్ఞామారులామోరికాద్యాః। కావ్యంకర్తుం సంతివిజ్ఞాస్స్త్రియోపి। విద్యాంవేత్తుం వాదినోనిర్విజేతుం। విశ్వంవక్తుంయఃప్రవీణస్సవంద్యః" ఈచెప్ప

బడిన శీలాదిస్త్రీలు కావ్యరచనయందును, సభలలో విద్వాంసులతో శాస్త్రవాదమొనర్చుటయందును, సమర్థురాండ్రని చెప్పబడినది. "శ్లో॥ శబ్దార్థయోస్సమోగుంఫః పాంచాలీరీతిరుచ్యతే। శీలాభట్టారకావాచి బాణోక్తిషుచసాయది" బాణుని కావ్యమునందును శీలాభట్టారికవాక్కులయందును పాంచాల రీతి గానంబడునని చెప్పబడినది. "పార్థస్యమనసిస్థానం లేభే ఖలుసుభద్రయా। కవీనాంచవచోవృత్తి చాతుర్యేణసుభద్రయా" సుభద్ర అర్జునునిమనస్సున నివసించినరీతి కవయిత్రియగు నీసుభద్ర తన కవితాచాతుర్యముచే కైసరుల మనములయందు స్థానము సంపాదించెనని చెప్పబడినది. "అహంకథంద్వితీయాస్యాత్ ద్వితీయాస్యామహంకథం" అహంకథమ్ అను నవ్యయములు ద్వితీయావిభక్తులని చెప్పు మూఢునకు నేనెట్లు ద్వితయను (భార్యను) అగుదునని అప్పయదీక్షితులవారి కుమారిక చెప్పెనట. ఈమె తాను విదుషినని సూచించెనుకదా; వీరుగాక, గణితశాస్త్రమురచించిన లీలావతియు, జ్యోతిశ్శాస్త్రమురచించిన ఖానాయు, భోజరాజుసతి భానుమతియు, కృష్ణరాయని కొమరితె మోహనాంగియు, కుమ్మరమొల్ల, తరిగొండ వెంగమ్మ, ముద్దుపళని మొదలగువారలెల్ల కావ్యములు రచించినవారలె. తోరుదత్తు, పండితరమాభాయి, ఆనందభాయిజోషి మొదలగు వారలాధునికులుగాన వీరిసంగతి నిపుడు ప్రస్తావించను. ఈపయినజెప్పిన విషయసందర్భములంబట్టి వేదకాలముమొదలుకొని మనదేశమున దురకల ప్రభుత్వము నెలకొనినదాక, మనస్త్రీలు వేదశాస్త్రాదివిద్యాభ్యాసమునవిచ్ఛిన్నముగ జేయుచుండెడివారని నిర్వివాదముగ దేలుచున్నది.

గావున స్త్రీలకు విద్య నేర్పించుట అవిగీతశిష్టాచారముగాని మ నమిప్పుడు క్రొత్తగ దెచ్చిపెట్టినది కాదు.

ఇక రెండవవిషయమగు "విద్యనేర్చినస్త్రీలు సంఘాభివృద్ధికెట్లు కారకురాండ్రగుదురు" అను విషయమునుగూర్చి చర్చింతము. ఈవిషయమును నిరూపించుటకు శ్రుతిస్మృతులనుండి నిదర్శనములు చూపనక్కరలేదు. ఇది కేవలము ననుభవైకగోచరమగు విషయము. స్త్రీలు కేవలము ప్రపంచమునకు జన్మభూములుకదా? క్షేత్రముయొక్క పరిశుద్ధత, బలమును నందుజనించు మొక్క యొక్క అభివృద్ధికెట్లు కారణమో జన్మస్థానమగు స్త్రీయు జ్ఞానశాలినియగుటచే జనితులగువారి సత్ప్రవర్తన క్షేమారోగ్యాభివృద్ధులకట్లు హేతువగును. తల్లియగు యువతి విద్యాజ్ఞానవతియయినచో బిడ్డలకు జిన్ననాటనుండియు విద్యాజ్ఞానాభిరతియు సత్ప్రవర్తనయును వెన్నతో బెట్టియలవాటుసేయును. తలిదండ్రులు మూర్ఖులై దుష్ప్రవర్తనగలవారలగుదురేని వారిసంతానము నట్టిదేయగుట మనము చూచుచునేయున్నాము. విద్యావ్యాసంగమును సత్ప్రవర్తనయుగల కుటుంబములలో బుట్టిన శిశువులు చిన్ననాటనుండియు దలిదండ్రుల నడవడినేయనుసరించి యడకువయు విద్యాసక్తియు మంచినడవడియు గలిగి మెలగుచుండుటయు మనమెరుగనిదికాదు. కాబట్టి తల్లివిద్యావతియయినచో బిడ్డలకిట్టిమేలు కలుగునని నేను వేరుగ చూపి చెప్పవలసిన యవసరములేదు. ప్రతిస్త్రీయు తల్లిగను, గృహిణిగను నుండును. తల్లిగనుండి నేయుమేలు పయిన సూచించబడినదే. గృహిణిగనుండునప్పుడు

గృహావ్యవహారమంతయు జక్కఁబెట్టుటకు నింటి ఆదాయవ్యయములు లెక్కఁజూచి మితవ్యయసిద్ధాంతము నవలంబించి సంసారము నిర్వహించవలయుపని స్త్రీలకు విహితము. ఇట్టి ప్రాముఖ్యమగు కృత్యమునిర్వహింపవలయు వెలది విద్యాగంధమెరుగక మూఢురాలయినచో నట్టి గృహమెట్లులుండునో వేరుగ జెప్పవలయునా? విద్యావిహీనలగు చానలు గృహనిర్వాహము నేయునెడ నాయవ్యయంబులెరుగక దూబరిదిండితన మలవాటు చేసికొని చూచినవస్తువులనెల్ల దెచ్చిపెట్టుమని మగల నిర్బంధించియు నింటికిదెచ్చిన వస్తుసామగ్రి యనవసరవ్యయము చేసియు యజమానిం బలుచిక్కులబెట్టి సంసార మప్పులపాలుసేయుచుండుట మనమెరుగనిసంగతికాదు. ఇల్లుద్ధరించు పల్లవాధరి విద్యావతియైనచో నిట్టియనర్థములు రాపుగద. అనవసరములగు కలతలు కలగజేసికొని నగలని చీరలని మగలమిగుల వగలంబెట్టి బెట్టిదంపుటిక్కట్టులపాలుపరచి సంసారమన్న నరణ్యప్రాయముగావించు గయ్యాళిగంపల నెందరినెరుగము. ఇట్టిచెడుగునకు విద్యాగంధమెరుగని మూర్ఖత్వముగాక వేరుకారణముగలదా? విద్యావతియగు వతివ పతిహితముగోరి మెలగనేర్చి సంసారము స్వర్గప్రాయముసేయదా? "అనుకూలకళత్రోయ స్తస్య స్వర్గ ఇహైవహి। ప్రతికూలకళత్రస్య నరకోనాత్రసంశయః"-దక్షస్మృతి అనగా అనుకూలయగు భార్యకలవాని కీలోకమే స్వర్గము, ప్రతికూలయగుభార్యయున్న నిదేనరకము అని చెప్పుచున్నది. యస్. ఆర్. వెల్సులను నమెరికాఖండశాస్త్రజ్ఞు డిట్లు వ్రాయుచున్నాడు. **"A good wife is the greatest earthly blessing" " A virtuous woman**

is a Crown to her husband" అనగా అనుకూలవతియగు సుభార్య పరమోత్కృష్టమయిన యిహలోకసుఖము. గుణవతియగుభార్య పురుషునకు శిరోభూషణమువంటిది అని చెప్పెను. "True mate exists somewhere in the world." She is worth-seeking for at any cost of trouble or expense, worth travelling round the globe to find, worth the endurance of labour and pain and privation." -Gilbert Hamertion. అనగా నిజమైన సహధర్మచారిణియగు భార్య దొరకుట దుర్ఘటము. అట్టిదామెను సంపాదించుకొరకు ఎంతవ్యయప్రయాసమైనను పడవచ్చును. ప్రపంచమంతయు చుట్టిరావలసివచ్చినను ఎట్టికష్టనిష్ఠురములకు లోనుగావలసివచ్చినను అట్టిభార్యను సంపాదించుటయందు వెనుతీయకూడదు అని చెప్పినాడు. శ్రీమహాభారతారణ్యపర్వమునందు "అర్ధంభార్యామనుష్యస్య భార్యాశ్రేష్ఠతమస్సఖా। భార్యామూలం త్రివర్గస్య భార్యామూలం తరిష్యతః। భార్యావంతః క్రియావంతః సభార్యాగృహమేధినః। భార్యావంతః ప్రమోదంతే భార్యావంతః శ్రియాన్వితాః। సఖాయః ప్రవిక్తేషు భవంత్యేతాః ప్రియంవదాః। పితరోధర్మకార్యేషు భవంత్యార్తస్యమాతరః। కాంతారేష్వపివిశ్రామో జనస్యాధ్వనికస్య వై। యస్సదారస్సవిశ్వాస్య స్తస్మాద్దారాః పరాగతిః" అనగా భార్య పురుషునకర్ధశరీరము, స్నేహితులోత్తమురాలు, ధర్మార్థకామములకాధారము, సద్గతికి ముఖ్యకారణము, యాగాదిక్రతువులొనర్చుటకును, సంతోషాబ్ధి నోలలాడించుటకును, మధురవాక్కులచే మనసురంజిలపజేయుటకును, పురుషునకు భార్య ముఖ్యము. భార్య పురుషునకు సంతోషసమయమున స్నేహి

తుడుగను, ధర్మకార్యములొనరించుతరి తండ్రిగను, రోగపీడితు డైనతరి తల్లివలెను వర్తించును గనుక నుత్తమురాలగు భార్య పురుషునకు పరమగతియని చెప్పబడినది. శ్లో॥ ద్విధాకృత్వాత్మనోదేహ మర్ధేన పురుషోభవత్ । అర్ధేననారితస్యాం తు విరాజమసృజత్ప్రభుః॥ శ్రుతి "అర్ధోవా ఏష ఆత్మనోయత్పత్నీ" ఇత్యాదులు భార్య భర్తకర్ధశరీరమని యుద్ఘోషించుచున్నవి. ఆవిషయమునందు బురుషుడు విద్యాశాలియై తన సగముశరీరమగు భార్యను విద్యాగంధమెరుగని మూర్ఖురాలుగ జేసిన పక్షవాతముగలిగిన దేహమువలె నిరుపయోగమై పోవును. ఎద్దును దున్నపోతునుగట్టినబండితో నేరుదాటబూనుకొనినట్లు విద్యావంతుడగుభర్తయు విద్యావిహీనయగు చానయు జాయాపతులై గృహయాత్రజరుపబూనినచో మధ్యేమార్గమున మునుగకమానదు. పురాణకథలయందిట్టి సుందరాంగులచరితము లెన్ని చదివితిమి. సీత, దమయంతి, మదయంతి, చంద్రమతి, ద్రౌపది మొదలగు నుత్తమాంగనలు భర్తలకు నిక్కట్టులుగలిగినపుడు విద్యావివేకములు వన్నెగన నెన్నియో విధముల హితమెరిగించి యాపదలు నిస్తరించు నుపాయములు దెలిపి యట్టివేళల వారల మనోనుకూలముగ బ్రవర్తించి ధైర్యముగలుగ బ్రబోధించి యుద్ధరించిన చరితలు ప్రఖ్యాతము గావె. ఈవిషయమిట్లుండనిచ్చి స్త్రీల ధైర్యసాహసములనుగురించి విచారించినచో పురుషులకన్న స్త్రీ లెక్కుడు ధైర్యము, సాహసము, పట్టుదలఁ గలవారని స్వభావమువలన విశదము కాగలదు. అట్టికాంతలు విద్యావతులైనపురుషులకు ధైర్యసాహసాదిగుణములు వృద్ధినొందునట్లు సేయగలరు. వారు తమ

సంతానమునకు నాబాల్యమును నిట్టిసద్గుణాబు లలవరచి దేశ క్షేమాభివృద్ధికి గారకులయ్యేదరు. అతిపురాతనగాధ లటుండని చ్చి రణతిక్కనకథ వింటిమా, అతడు రణమున వీగివచ్చినపుడు గృహమునకురాగనే భార్య దొడ్డిలోస్నానమునకునీళ్ళుంచి బిం దెమీాద పసుపుముద్దపెట్టి మంచముచాటుంచెననియు నందున లన రణమున బరాజితుడై వెరచివచ్చిన తాను స్త్రీతుల్యుడని సూచించెనని యతడు వ్యసనపడుచుండ, క॥ పగరకువెన్నిచ్చి నచో। నగరేనిను మగతనంపు నాయకులందున్ । ముగురాడు వారమైతిమి। వగపేటికి జలకమాడ వచ్చినచోటన్॥ అని భా ర్య యనియెననియు, భోజనావసరమున బాలువిరుగం గాంచి యిదేమనిన నంత, కం॥ అసదృశముగ నరివీరుల। పసదీరగగె లువలేక పందక్రియన్నీ । వసివాచి తిరిగివచ్చిన। బసులున్విరిగి నవి తిక్క పాలున్విరిగెన్॥ అని తల్లిచెప్పెననియు నీవిధమున భార్యచేతను దల్లిచేతను బ్రోత్సాహమొంది యతడు తిరిగియు ద్ధమునకు వెడలి శత్రులనుదుమాడి వీరస్వర్గము చూరగొనెనె నినియు దెలియవచ్చుచున్నది. ఇట్టి వీరమాతలును వీరపత్ను లును బెక్కండ్రుకలరు. రాణీసంయుక్త, అహల్యాబాయి, ప న్నాబాయి మొదలగువారిచరిత్రలు వింటిమా ఈసంగతి మ రింత ధృవపడును. అసదృశపరాక్రమయశోవిరాజి యగు శి వాజి విక్రమవ్యవహారమునకెల్ల నతనితల్లి జిజాబాయి యుపదే శమే కారణమని తచ్చరిత్రవలన విశదపడగలదు. గ్రంథవిస్తర భయములేకున్న నిట్టి వింకెన్ని యోదృష్టాంతములు చూపవ చ్చును. స్త్రీలు విద్యావతులయినచో సంఘాభివృద్ధికి కారణ ములగు నీతిప్రవర్తనలు శౌర్యధైర్యాదిగుణములు తమసం

తానమునకు నుగ్గుబాలతోడన కరపనేర్తురు. ఇంతవరకు జె ప్పినదానివలన స్త్రీలకు విద్యజెప్పుట యవసరమని విశదము కాకమానదు. అయితే అట్టివిద్య యెంతవరకుజెప్పవలయును నేవిధమున నుండవలయు ననువిషయము విచారించవలెను. స్త్రీలకుజెప్పువిద్య కేవలము నక్షరముల గుర్తించుట పేరులు వ్రాయుట వంటిప్రారంభవిద్యమాత్రమేకాదు. పురుషులకంటె వారు కుటుంబయాత్రానిర్వాహణమునకు ముఖ్యోరాండ్రగుటనుక నందుకువలయు విద్య యవశ్యకముగా నేర్పవలయును. నీతిశాస్త్రము, పాకశాస్త్రము, ఆరోగ్యరక్షణశాస్త్రము, కొద్దిపాటి వైద్యశాస్త్రము, గణితము, భూగోళము, చరిత్రము, గృహకృత్యనిర్వాహము, మితవ్యయము మొదలగువిద్యలు చక్కగా నేర్పవలయును. కుట్టుపని, కొద్దిపాటి హస్తశిల్పము మొదలగుకళలు నేర్పవలెను. ఇదిగాక నీతిప్రవర్తనకువలయు పురాతనపుణ్యస్త్రీలచరిత్రలు, ఇతిహాసములు, పాతివ్రత్యము, పతిశుశ్రూష మొదలగు గుణములలవడుటకు దగు చరిత్రలును నేర్పవలయును, ఈశ్వరభక్తియలవడుటకు తత్వశాస్త్రము కొంచమైనను నేర్పవలయును . పురాణములు, ధర్మశాస్త్రములు చదివి వానియర్థము బోధపరచుకొనుటకు జాలినంత విద్య యొసంగవలయును. ఉన్నతవిద్యలభ్యసించి పట్టపరీక్షలయందు దారితేరవలయు నవశ్యము లేదుగాని లోకవ్యవహారములెరింగి తమ కుటుంబయాత్ర చక్కగా జరుపుకొనుటకు వలయు విద్య నేర్పితీరవలెను. అట్లు మనస్త్రీలు విద్యావతులయినప్పుడే మనసంఘమభివృద్ధిలోనికివచ్చి మున్నొక కాలమునందు గన్న యున్నతస్థానము నలంకరించగలదు.

మన ప్రభువులగు హూణసంఘము తమ స్త్రీలయొక్క యోగ్యవిద్యాభ్యాసమువలననే తామిట్టి సామ్రాజ్యగౌరవము లందగలిగిరి. వీరిసంగతి యటుండనిచ్చి జాపానీయులసంగతి విమర్శించినచో మొన్న మొన్నటిదాక నూరుపేరులేక నొకమూలబడియుండినవారు పాశ్చాత్యనాగరికత నవలంబించి తమస్త్రీల కుచితవిద్య యొసంగనేర్చిననాడి నవనవాభ్యుదయము నొంది యిప్పుడు నాగరిక శిరోమణులలో నగ్రస్థానము నొందగలిగిరి. గడచిన రష్యా జపానుయుద్ధములో నొక జాపానుమానవతి తాఁగన్న పుత్రత్రయంబు మడియుటకు దుఃఖించుచుండెనని నాపెను గొందరు పెద్దమనుష్యులు పరామర్శింప నేగినప్పుడు వారింగాంచి తానుదురపిల్లుట తన పుత్రులగోల్పోవుటకు కాదుగాని జపానుకై యుద్ధముసేయుట కింకొకతనయుడు లేడయ్యెనని వగచుచున్నానని చెప్పినదట. ఆహా! యేమి యీవీరమాతధైర్యసాహసములు! ఇట్టి దేశాభిమానపూరితలగు మానవతులుండుటచేతనేగదా జపానున కట్టియదృష్టము లభించినది! అచ్చటిస్త్రీలు విద్యాగంధము చవిచూచుటచేతనేకదా ఇట్టి సద్గుణంబులు వారికలవడినవి? మనదేశమునందుఁగూడ నిట్టి గుణవతులగు యువతులు లేకపోలేదు. ఉన్నారుగాని వారిగుణములు ప్రకాశించుటకు వలయు సాధనములేక నణుగునబడియున్నారు. మాణిక్యమెంతమంచిదయినను మసిప్రాతనుగట్టి దానిమాలిన్యము దొలగించకున్న నదియొక గాజుపెంకగును. దానిని సానబట్టి మెరుగిడినచో దేదీప్యమానమై ప్రకాశించును గదా! అట్లుగానే మనస్త్రీలకు యోగ్యవిద్యనిచ్చి వారినభివృద్ధిలోనికి దేనంత కాలము హిందూప్రజలకు వలయు సద్గుణవృం

జనులవడక సంఘమిట్టి హైన్యదశయందుండవలసినదే. ఇప్పు
డిప్పుడు నవనాగరిక మతావలంబులగు ఘనులు కొందరు స్త్రీ
విద్యను పునరుజ్జీవింపజేయ బూనుకొనియున్నారుగాని పూ
ర్వాచారపరాయణులమనుకొనెడు కొందరు వారి మార్గమున
కడ్డమువచ్చి పెక్కుచిక్కులుపెట్టజూచుచున్నారు వారికి
స్త్రీలకు జదువునేర్పవలెనని చెప్పిన దలనొప్పివచ్చును. వారు
స్త్రీలు విద్యనేర్చి యుద్యోగములుచేతురా వారికి చదువేలనం
దురు. విద్య యుద్యోగసంపాదనకేయని వారియభిప్రాయము.
ఇది యెంతటిపొరపాటు? విద్యయనగా జ్ఞానమనర్థము. చదువు
వలన జ్ఞానాభివృద్ధియగును. జ్ఞానమనునది వెలుగు. అదిలేనిచో
నజ్ఞానమను నంధకారమున నిమగ్నులగుదురు. అట్టి అజ్ఞానాంధ
కారమగ్నులే మూర్ఖులు. యుక్తాయుక్త వివక్షత వారికి దెలియ
దు. మూర్ఖులు తమమేలే తామెరుగరు. దైవమున వారికి దెలి
యదు. నీతిమెట్టిదో వారికి గోచరముకాదు. దేశమననేమో
దానియభివృద్ధియెట్టిదో తామెట్టిస్థితిలోనున్నారో వారికి దెలి
యదు. మూర్ఖులస్థితి యిట్టిదేకద? మనదేశమిట్టి మౌఢ్యాంధ
రమున మునిగియుండుటనేకద తమస్థితి తమకు దెలియకున్న
. మనపూర్వాచారపరాయణులీతెగలోనివారేయని చెప్పి
నమకు నామీద కోపగించవలదు. వారెవ్వరో మీరేమో
?ంచినగాక. తమకువిద్యలేనందున నుద్యోగములేదని భ్ర
మించుచున్నారుగాని జ్ఞానములేదని వారెరుగరు. "విద్యావి
హీనః పశుః" అనిచెప్పిన ప్రాచీనులనీతి వారెరుగరు. మీరుమి
క్కిలి స్త్రీలు చదువుకొనిన విటులకు త్తరములు వ్రాసెదరని
- నందువలన వ్యభిచారమెక్కుడగుననియు వారికొక యు

క్తి చెప్పెదరు. ఇదెంతపరిహాసాస్పదమో చూచితిరా? విద్యయనఁగా జ్ఞానమని చెప్పితిమి. జ్ఞానమున్నచో దుష్కార్యాచరణకు ప్రేరేపించునా? జ్ఞానములేనివారజ్ఞానులు. అట్టిమూఢులే యుక్తాయుక్తవివేకములేక తాత్కాలికసుఖాపేక్షితులై దుష్కార్యముల కలవాటుపడియెదరు. దుష్ప్రవర్తనకజ్ఞానమే ముఖ్యకారణము. జ్ఞానవంతులొకవేళ దుష్కార్యలంపటులగునను వారి యంతరాత్మ యడుగడుగునను నిరోధించుచునేయుండును. ఇది అనుభవగోచరమగు విషయమే. విటులకుత్తరములు వ్రాయనేరని నిరక్షరకుక్షులగు మూఢస్త్రీలే వ్యభిచారమునకు మూలదుంపలై వెంపరలాడుచుండుట మనము చూచుచునేయున్నాము. కావున నీయపూర్వజ్ఞాన లవదుర్విదగ్ధుల యాక్షేపములు నిలువ తావులేకపోయినవి. ఇక స్త్రీలు స్వాతంత్ర్యగౌరవముల కర్హులా కాదా యని కొంచము విచారింతము. పూర్వకాలమునఁ బురుషులకన్న స్త్రీలె గౌరవము నందుచుండిరని తోచుచున్నది. పుత్రసంతానముకన్న నప్పుడు పుత్రికాసంతానమే కావలయునని కోరుచుండెడివారు. " అథయ ఇచ్ఛేద్దుహితా మే పండితా జాయేత సర్వమాయుర్యాదితి తిలౌదనంపాచయిత్వా సర్పిష్మంతమశ్నీయాతామీశ్వరౌ జనయితవై "-శుక్లయజుర్వేదబృహదారణ్యకం 8 అధ్యాయం 4 బ్రాహ్మణము 18 మంత్రము. అనగా విదుషియగుపుత్రిక గావలయునని కోరెడువారు నూవులపులగమువండి నేతితో భుజించిరేని యట్టిపుత్రిక పుట్టును, అని చెప్పెడు వేదవాక్యమిందునకు నిదర్శనము. శ్రుతి "మాతృదేవోభవ, పితృదేవోభవ" అను నెడ తండ్రికంటె ముందర దల్లిని స్మరించుచున్నది. "జనకునకుబదిమడుం

గులు। జనని గురుత్వమున నిది ప్రశస్తము శ్రుతులన్" అని భారతము చెప్పుచున్నది. "యథాభూమి స్తథానారీ తస్మాత్తాం నతుదూషయేత్"-పరాశరస్మృతి. భూమివలె స్త్రీయు పవిత్రగాన నామెను దూషింపరాదుఅని. "సర్వగాత్రాణి యోషితామ్"-దక్షస్మృతి, స్త్రీలు సర్వాంగపావనులని చెప్పుచున్నది "యత్రనార్యస్తుపూజ్యంతే రమంతే తత్రదేవతాః। యత్రైతాస్తునపూజ్యంతే సర్వాస్తత్రాఫలాఃక్రియాః"- మనుస్మృతి. ఎచ్చట స్త్రీలుగౌరవించబడిమెదరో అచ్చటనే యెల్లదేవతలు నివసించెదరు. ఎచ్చట నాస్త్రీలు గౌరవింపబడరో అక్కడ నే క్రియలుచేసినను అవి నిరర్థకములు అని చెప్పుచున్నది ఇందు వలన స్త్రీలు గౌరవార్హులగుదురాకారాయను సందియముతీరకుండదు. పూర్వకాలమున బ్రతివారును నీవెవ్వరవని యడిగిన ప్పుడు "దీర్ఘతమామామతేయః" మమతాదేవి పుత్రుండనగు దీర్ఘతముడనువాడను "మహీదాస ఐతరేయః" ఐతరాదేవిపుత్రుడనగు మహీదాసుడను. ఇట్లు తండ్రిపేరునకుబదులు తల్లిపేరే చెప్పుచుండు నాచారముగలదు. ఇందువలన స్త్రీలు గౌరవార్హులగుదురని చెప్పవలెనా? "స్త్రీణాం ద్విగుణమాహారం బుద్ధిశ్చాపిచతుర్గుణమ్। సాహసం షడ్గుణం తేషాం" అనునట్లు స్త్రీలకు బుద్ధియు సాహసధైర్యములును పురుషులకంటెమెండు. కావుననే ఆదికాలమునందు, మంత్రిత్వాదిరాజకార్యములందును, సేనానాయక పురరక్షకాది పదవులయందును స్త్రీలే నియమించబడుచుండువారని పెక్కునిదర్శనములున్నవి. సత్య నరకునితో యుద్ధముచేసినది. కైకేయి యుద్ధములో భర్తకు రథమునడపినది. మరియు పెక్కండ్రిట్టివారుకలరు. స్త్రీ

లు పెక్కండ్రు రాజ్యపీఠముల నలంకరించి పురుషులకన్న మిన్నగా ప్రజాపాలనముగావించిరి. ఇట్లు రాజ్యభారముగైకొన్న గణపతిదేవునిపుత్రిక రుద్రాంబ, అహల్య, చౌధురాణి మొదలగువారలత్యంత ఖ్యాతినొందినారు. సాక్షాల్లక్ష్మియు జననీశిరోరత్నమునగు శ్రీ విక్టోరియామహారాణిగారిచరిత్రము మనకెల్లరకు ననుభవైకవేద్యమేగదా. ఇట్టి స్త్రీలు గౌరవపాత్రలగుదురని వేరుగ జెప్పనక్కరలేదు. "ప్రావృతాం యజ్ఞోపవీతిని మభ్యుదానయన్ జపేత్ సోమోదదత్ గంధర్వాయేతి" -గోభిల గృహ్యసూత్రము; శ్రీమద్రామాయణము అయోధ్యాకాండయందలి "కౌసల్యాపితదాదేవీ...అను శ్లోకము మొదలు "తాం శుక్లక్షౌమసంవీతాం" అను శ్లోకమువరకును మరియు శ్లో॥ తతస్తుజలశేషేణ లక్ష్మణోప్యుత్త ధా వాగ్యతాస్తే త్రయస్సంధ్యాం సముపాసతసంహితాః॥ సుందరకాండ 14 స్సర్గలో "సంధ్యాకాలమనాస్స్యామా ధృవమేష్యతి జానకీ నదీంచేమాం శివజలాం సంధ్యార్థే వరవర్ణిని" ఇత్యాదులవలన బూర్వకాలమున స్త్రీల కుపనయనార్హతయు సంధ్యాదికర్మల చేయు నాచారమును స్వతంత్రముగలదని తెలియుచున్నది ఇది మనప్రస్తుతాంశముకాదు ఇంతవరకు జేసిన విచారణవలన స్త్రీలకు విద్యనేర్పించుపద్ధతి యవిగీతశిష్టాచారమనియు, సద్విద్యావతులగు స్త్రీలవలన మన సంఘాభివృద్ధికి నలఘుప్రోత్సాహము లభించుననియు, స్త్రీలకు విద్యనేర్పరాదనువారి వాదము సహేతుకముకాదనియు, స్త్రీలు స్వాతంత్ర్యగౌరవపాత్రలనియు దేలినది. కావున దేశాభివృద్ధియు, సంఘాభివృద్ధియుగోరి మనపూర్వులధిష్టించిన యున్నతపదమును మనమింకొకసారి

చవిచూడదలచినవారమైతిమేని మన స్త్రీలను వంటయింటిబానిసలుగ జేసి కారాగృహబద్ధలను జేయక వారికి యుక్తమగు విద్యనొసగుటకు వలయు ప్రయత్నములన్నియు మనము పూనికతో జేయవలయును. మన స్త్రీలు విద్యావతులుగాక యిప్పటి హైన్యస్థితియందుండునంతకాలమును మనము వృద్ధినొందజాలము. కాబట్టి ఇప్పటికయినను మనవారందరు కన్నులువిచ్చి యితరదేశము లనుభవించుచున్న గరిక సభ్యవర్తన గౌరవములు కన్నులారజూచి మనుష్యజాతిలో చేరిన మనమును సద్గౌరవమందుటకు యోగ్యతగలవారమనియు దానికై ప్రయత్నించుట మనకు విధాయకకృత్యమనియు జక్కగా దెలిసికొని యందుకు బునాదివేయదలచితిమేని మనస్త్రీలను దప్పక యుక్తవిద్యావతులను జేయవలెను. అప్పుడే మనదేశము నాగరికదేశములలో నొకటియయి యఖండైశ్వర్యములతో దులదూగుచుండగలదు. స్త్రీల జదివించవలెననినచో కేవలము నక్షరములను గుర్తించి చదువునంతటి యల్పవిద్య గరపుటమాత్రముకాదు. ప్రాపంచిక పరిజ్ఞానమంతయు నలవరుచుకొని గృహకృత్యములు నిర్వహించుచు నీతిమార్గముదెలిసికొని దేశక్షేమాభివృద్ధికి దోడ్పడజాలినంతటి విద్య నొసగవలయును. ఇప్పటి శాలికాపాఠశాలలయందట్టి విద్య నొసంగబడుచుండునట్టుల ప్రభుత్వము వారి నభ్యర్థించుచు మనమును నందుకు దోడ్పడవలయును. స్త్రీలకు పఠనార్హములగు గ్రంథములు దేశభాషలలో వ్రాయవలయును. దేశభాషాభివృద్ధికి దగు ప్రోత్సాహమివ్వవలయును. ఇట్టి కార్యమునకు మనము పట్టుదలతో పనిచేసినప్పుడే మనము భావివృద్ధికి కారకులమై దేశమా

తగర్భమున జన్మించినందు కాపెకు గీర్తి ప్రతిష్ఠలు దెచ్చినవా రమగుదుము. నేను చెప్పగలవిషయమంతయు దీనితోడనే చరితార్థమగును గాన ననవసర ప్రసంగము పెంచి మీకు విసుగుకలిగించుటకు బూనుకొనక విరమించుచున్నాడను.

గీ॥ తగినశాస్త్రంబులోకకొన్ని • తఱచి తఱచి
సజ్జనులుమెచ్చ స్త్రీవిద్య • సారసంగ్ర
హంబనగ దీని వ్రాసితి • నాదరింప
గోరుచున్నాడ రచనకు • గ్రొత్తవాడ॥

క॥ స్త్రీవిద్యాసారసంగ్రహ
మే వేళన్ జదివిమీర • లింపుగ స్త్రీలన్
గావింపగవలయును వి
ద్యావతులౌనట్లు లవని • దప్పకదయతోన్॥

## ఈ గ్రంథకర్తచే రచియింపబడిన గ్రంథములు.

(1) దొంగస్వామి చరిత్రము—పద్యకావ్యము, ఈగ్రంథమునందు యతుల మాయలు, బ్రాహ్మణులమూఢభక్తి, విప్రకుల మపవిత్రమగుటకు కారణములు, దేశాభివృద్ధికి కావలసినపనులు మొదలగునవి మనోహరముగ వర్ణింపబడినవి. ప్రతియింటనుండదగినగ్రంథము. పెక్కండ్రుపండితుల పొగడికగన్నది. వెల రు 0-1-6.

(2) శ్రీ వేణుగోపాలసీసతారావళి—భక్తుల కత్యంతోపయుక్తంబగునటుల వర్ణింపబడిన 27 సీసపద్యములుగల గ్రంథము. వెల రు 0-0-6.

## ముద్రణయందున్న గ్రంథములు.

(1) మిత్రవిందాపరిణయము—హరికథ. నూతనమట్లు, మనోహరములగు గోహారలును, అంత్యనియమములగు పద్యములునుగలిగి దేశభక్తియు, యీశ్వర భక్తియు బోధించుగ్రంథము.

(2) భరతమాతృస్తవము—దేశభక్తుల కత్యంతోపయుక్తము.

(3) ఆంధ్రమాతృస్తవము—ప్రతిఆంధ్రునియింటనుండదగినగ్రంథము.

(4) శ్రీరాముని బాల్యదశ—నాటకము. దయ్యములు, ఎఱుక, కన్యావిక్రయము, వరవిక్రయము, మొదలగువాటిని నిరసించుగ్రంథము.

(5) కమలావతి—షేక్సుపియర్ సింబలైనున కనుసరితమైన 6అంకముల తెలుగు నాటకము.

(6) కుహ్వాదుల్లాపిని—లంచములు మొదలగువాటిని గుఱించి చక్కఁగా వర్ణింపబడినది

(7) నిమ్నజాత్యోద్ధరణ. (8) సముద్రయానము మొదలగునవి.

కావలసినవారు,

బ్రహ్మభట్ల పట్టాభిరామశర్మ,
గుడివాడ, కృష్ణాజిల్లా.
అని వ్రాయవలయును.